| | | |
|---|---|---|
| 20. | పురాయి ఘటశాసి | ,, |
| 21. | అన్నక ,, | ,, |
| 22. | సూరె భట్టోపాధ్యాయ | అత్రేయ |
| 23. | శరభ ,, | ,, |
| 24. | రాలిపెద్ది భటో పాధ్యాయ | గౌతమ |
| 25. | వెలుపులపోతి ఘటశాసి | ,, |
| 26. | అనంత భట్టోపాధ్యాయ | కౌండిన్య |
| 27. | నూకన ఘటశాసి | ,, |
| 28. | అప్పన భట్టో పాధ్యాయ | ,, |
| 29. | కేశన భట్టోపాధ్యాయ | ,, |
| 30. | సూరె ఘటశాసి | ,, |
| 31. | కామదేవ ఘటశాసి | ,, |
| 32. | నరసింహ ,, | ,, |
| 33. | దామోదర ,, | ,, |
| 34. | రేవన ,, | ,, |
| 35. | కందర్ప ఘటశాసి | వాధూల |
| 36. | సూరె ఘటశాసి | ,, |
| 37. | పురుషోత్తమ ఘటశాసి | ,, |
| 38. | మంచెన ఘటశాసి | కాశ్యప |
| 39. | అనంత ఘటశాసి | ,, |
| 40. | దేవన ఘటశాసి | శర |
| 41. | సర్వదేవ భట్టోపాధ్యాయ | శాండిల్య |

ఓనపల్లి గ్రామము, పులుపర్తిలో 30 ఖారీల భూమిని పొందిన పిమ్మట విద్దన దానిని ఉత్తరేశ్వర పురపు పొలమునకు కలిపి వేసెను. ఈ క్షేత్రమును యీ క్రింది బ్రాహ్మణులకు యిచ్చెను.

| వరుససంఖ్య | ప్రతి గృహీతల పేర్లు | గోత్రములు | వృత్తులు |
|---|---|---|---|
| 1 | విద్దన భట్టోపాధ్యాయ | హారిత | 2½ |
| 2 | రుద్రె సోమయాజి | ,, | 2 |
| 3 | ప్రోలె ఘటశాసి | ,, | 2 |
| 4 | అన్నె ఘటశాసి | ,, | 2 |
| 5 | పురుషోత్తమ భటో పాధ్యాయ సోమయాజి | ,, | 2 |
| 6 | ప్రోలె భట్టోపాధ్యాయ | ,, | 2 |
| 7 | కేశవ ,, | ,, | 2 |
| 8 | ఎన్నెహి తాత | ,, | ... |
| 9 | వల్లభ సోమయాజి | ,, | 1/2 |
| 10 | కంచి ఘటశాసి | ,, | ... |
| 11 | నరసింహ ,, | ,, | ... |
| 12 | శ్రీరామ ,, | ,, | 1/2 |
| 13 | తొత్త్రే యగ్నేశ్వర ఘటశాసి[9] | ,, | 1/2 |
| 14 | యగ్నేశ్వర ఘటశాసి | ,, | 1/2 |
| 15 | మారె ఘటశాసి | ,, | 1/2 |
| 16 | జన్నె ఘటశాసి | ,, | 3/4 |
| 17 | దేవరె భటోపాధ్యాయ | భారద్వాజ | ... |
| 18 | రేమన ,, | ,, | ... |
| 19 | కూచన ,, | ,, | ... |
| 20 | మంచి ,, | ,, | ... |
| 21 | నరసింహ ఘటశాసి | ,, | ... |
| 22 | పురాయి ,, | ,, | 1/2 |
| 23 | సోమేశ్వర ,, | ,, | 1/2 |
| 24 | కామదేవ భటో పాధ్యాయ | ,, | ... |
| 25 | ఎఱపోత ఘటశాసి | ,, | 1/2 |
| 26 | నరసింహ ,, | ,, | 1/4 |
| 27 | విశ్వేశ్వర ,, | ,, | ... |
| 28 | జన్నె ,, | ,, | 1/2 |
| 29 | నూంకన ,, | కౌండిన్య | ... |
| 30 | సోమిది భట్టోపాధ్యాయ | ,, | ... |
| 31 | విశ్వేశ్వర ,, | ,, | ... |
| 32 | గుండిమంచి ఘటశాసి | ,, | ... |
| 33 | దొత్త్రె ,, | ,, | ... |
| 34 | భీమేశ్వర ,, | ,, | ... |
| 35 | విశ్వనాధ ,, | ,, | ... |
| 36 | తోంట సోమయాజి | ,, | ... |
| 37 | చెన్నె ఘటశాసి | ,, | ... |
| 38 | యగ్నేశ్వర భట్టోపాధ్యాయ | ,, | ... |
| 39 | నాగదేవ ఘటశాసి | ,, | ... |
| 40 | కనకవెల్లి నరసింహ ఘటశాసి | ,, | ... |
| 41 | నరసింహ ఘటశాసి | ,, | ... |
| 42 | విదన | ,, | 1/2 |
| 43 | కందర్ప ఘటశాసి | ,, | 1/2 |
| 44 | ప్రోలె భట్టోపాధ్యాయ | ,, | 1/2 |
| 45 | జన్నె భట్టోపాధ్యాయ | ,, | 1/2 |
| 46 | కోరెన ఘటశాసి | ,, | 1/2 |
| 47 | గోకయ భట్టోపాధ్యాయ | గౌతమ | ... |

| | | | |
|---|---|---|---|
| 48 | నిఅపోత ఘటశాసి | గార్గ | ... |
| 49 | కేశవ భట్టోపాధ్యాయ | ఆత్రేయ | 3/4 |
| 50 | సోమనాథ ఘటశాసి | ” | 1/2 |
| 51 | జన్నె ” | ” | 1/2 |
| 52 | అన్నె ” | లోహిత | ... |
| 53 | కామన ” | ” | 1/4 |
| 54 | కామన ” | కౌశిక | ... |
| 55 | మారె ” | ” | ... |
| 56 | ప్రోలె ” | కాశ్యప | ... |
| 57 | కేశవ యాజ్యు | ” | 1/2 |
| 58 | నారాయణ ఘటశాసి | ” | 1/2 |
| 59 | ఉత్తరేశ్వర ఘటశాసి | శిర | ... |
| 60 | జన్నె సోమయాజి | వాధూల | ... |
| 61 | శ్రీరామ భట్టోపాధ్యాయ | విష్ణువృద్ధ | 1/2 |
| 62 | పురుషోత్తమ ఘటశాసి | ” | 1/2 |
| 63 | కందర్ప ” | భారద్వాజ | 1/4 |
| 64 | పెద్ది ” | ... | 3/4 |
| 65 | గోమట భరత | ... | 1/2 |
| 66 | సర్వదేవ ఘటశాసి | కపి | 1/2 |
| 67 | ఆరాధ్యకుమారుడు వీరభద్రుడు | కపి | 1/2 |
| | విద్దన భట్టోపాధ్యాయ | కపి | 12 |
| | మార్కండేశ్వర మహాదేవ | — | 5 |
| | ఉత్తరేశ్వర మహాదేవ | — | 3 |
| | జనార్దన వల్లభ | — | 2 |

108 నుండి 118 వరకుగల పంక్తులు ఉత్తరేశ్వరమునకు ఎల్లలు చెప్పును. వివిధ దిక్కులలో ఓనపల్లి, కడమి, పులుపర్తి, ప్రేకేరు, ముక్కోమల గలవు. ఫలశ్రుతి ప్రతిగ్రహీతల రెండు జాబి వెనుక గలదు (పంక్తులు 138 148, 175-76).

ఈ శాసనము కాకతీయుల బంధువులను గూర్చి తెలుపు చున్నది కాకతి వీరరుద్రునిపేరు మొదట తెలుపబడినది. అతని బంధువు విష్ణువర్ధనుడు. ఈతని పుత్రుడు ఇందుశేఖరుడు, మనుమడు మహాదేవుడు, మునిమనుమడు ఇందుశేఖరుడు.

దాతయొక్క ప్రపితామహుడు కాకతీయుల బంధువని తప్ప స్పష్టమైన బంధుత్వము శాసనము తెల్పుటలేదు. కాని వారు కాకతీయులతో వైవాహిక సంబంధములుగల నిడుదవోలు చాళుక్యులుతప్ప వేరొకరు కానేరరు. రాజులపేర్ల పోలిక, శాసనమునందుగల ఊళ్ల పేర్లు చాళుక్య భూమియందుండుట, పై నిర్ణయమునకొక తార్కాణము. జుత్తిగ, పాలకొల్లు[10] శాసనములనుబట్టి కాకతి రుద్రమదేవి ఉదయాంబ, ఇందుశేఖరుల పుత్రుడైన చాళుక్య వీరభద్రుని పరిణయమాడినట్లు లియుచున్నది. అవి యీ క్రింది వంశక్రమమును యిచ్చుచున్నవి :

జుత్తిగ (పశ్చిమ గోదావరి జిల్లా), క్రీ శ 1259
కాకతీయ గణపతి
|
రుద్రదేవి + చాళుక్య వీరభద్రుడు.

పాలకొల్లు (పశ్చిమ గోదావరి జిల్లా), క్రీ. శ. 1264
ఇందుశేఖరుడు + ఉదయాంబ
|
అన్నమాంబ + హైహాయ భీమవల్లభ | వీరభద్రుడు

క్రీ. శ 1266నాటి పాలకొల్లులోని మరియొక శాసనము చాళుక్యాధిపతి ఇందుశేఖరుని తండ్రియు, వీరభద్రుని తాతయునగు విష్ణువర్ధనుని గూర్చి తెలుపుచున్నది[11] ఈ మూడు శాసనములు క్రిందివిధముగ వీరభద్రుని వంశమును నిర్ణయించుటకు ఉపయోగ పడుచున్నవి :

విష్ణువర్ధనుడు
|
చాళుక్యాధిపతి ఇందుశేఖరుడు + ఉదయాంబ
చాళుక్య వీరభద్రుడు + కాకతి రుద్రదేవి

కొలనుపాక శాసనాధారముతో శ్రీ సిహెచ్. వీరభద్రరావు, డా. ఎమ్. రామారావు, శ్రీ కె. లక్ష్మీరంజనం వీరభద్రుని వంశక్రమమును వేరొక విధముగ గమనించిరి.[12]

క్రీ. శ. 1279నాటి కొలనుపాక శాసనము[13] నందు వీరభద్రుడు. అతని భార్య రుద్రదేవి, మహాదేవరాజు, అతని భార్య లక్కాంబ, వారి పుత్రుడు ఇందుశేఖరుడు మొదలగువారి ప్రశంస కలదు. ఈ ముగ్గురు చరిత్రకారులు మహాదేవ, లక్కాంబల పుత్రుడగు ఇందుశేఖరుడు, ఉదయాంబ భర్తయగు ఇందుశేఖరుడు ఒకరేనని తీర్మానించిరి. దీనివలన వీరభద్రుడు మహాదేవునియొక్క మనుమడగును. అప్పుడు మహాదేవుడు, విష్ణువర్ధనుడు ఒకరేనని చెప్పవలయును. అప్పుడు వంశక్రమము :

మహాదేవరాజు (లేక) విష్ణువర్ధనుడు + లక్కాంబ
|
ఇందుశేఖరుడు + ఉదయాంబ
|
వీరభద్రుడు + రుద్రదేవి

కాని కొలనుపాక శాసనము వీరభద్రునికి, మహాదేవునకు గల సంబంధమును గూర్చి స్పష్ట పరుపదు, పైన పేర్కొనిన శాసనము నందలి రెండవవైపు వీరభద్రుని గూర్చి తెలుపబడినది. కాని ఆఖరిపంక్తి (10వ శ్లోకము) అసంపూర్ణముగ ఉన్నది.

"............జ్యే
ష్ఠశ్చాళుక్య వంశార్ణ
........ ........"

మిగిలినదంతయు చెడిపోయినది మూడవ పక్క వాక్యమధ్యముతో ప్రారంభింపబడినది. అది 'శత్రువులనబడు చీకటికి కాంతివంటి' ఒకరిని గూర్చి తెలుపుచున్నది తరువాతి శ్లోకము (12) ఇందుశేఖరుడు మహాదేవ, లక్కాంబలకు పుట్టినట్లుగ చెప్పుచున్నది.

"........... ||[11*]లక్కాంబా
యాంసుతో జాత శ్రీ మహా
దేవరాజతః/నామ్నేందుశే
ఖరో రాజాకుమార శ్శివయో
రివ ||[12*] ఇందుశేఖర నరేంద్ర
నందనే నందతి స్వయము
శేష నందనే/జగ్మషాం విత
రణం రణం ముహు(స్స*)|ర్
స్తత్రైవ విదుషాం ద్విషామపి||[13*]

"జ్యేష్ఠశ్చాళుక్య వంశార్ణ" వీరభద్రునికి అన్వయించుననియు, "ఇందుశేఖర నరేంద్ర నందనే" అనునవి "ఇందుశేఖర నరేంద్ర (స్య) నందనే" (ఇందుశేఖరుని కుమారుడు) అనియు డా. రామారావు, శ్రీ వీరభద్రరావు భావించుచున్నారు.

వీరభద్రునకు, మహాదేవునకు గల సంబంధము స్పష్టముగ తెలియకపోవుటచేతను, ఇందుశేఖర నరేంద్రుని పుత్రునిపేరు అందులో లిఖింపబడకపోవుటచేతను, వారు ఇందుశేఖరుని కుమారుడు వీరభద్రుడనియు భావించుచున్నారు. అప్పుడు అతడు కనీసము క్రీ. శ. 1279 వరకు బ్రతికియుండవలెను. కాని వీరభద్రుని తల్లి యైన ఉదయాంబిక పాలకొల్లులో క్రీ. శ. 1266లో తన కుమారునికి పుణ్యము కలుగుటకు దానమిచ్చినట్లు తెలియుచున్నది పెద్దలు పిన్నల పేరిట దానమిడుట పిన్నల మృతి పిదపనే పైగా ప్రస్తుత శాసనము లేమియు రుద్రదేవి యొక్క భర్తనుగూర్చి ప్రసంగించలేదు. 13వ శ్లోకం వలన రాజకుమార ఇందుశేఖరుడు -- 'ఇందుశేఖర నరేంద్ర నందన'-క్రీ. శ. 1279వరకు జీవించినట్లు స్పష్టమగుచున్నది. 16వశ్లోకం ప్రకారము అతడు వీరేందుశేఖరుడని, పోతినాయకుని ప్రభువని, కొలనుపాక శాసనదాత అని చెప్పబడినాడు. కనుక 'ఇందుశేఖర నరేంద్ర నందన'ను 'ఇందుశేఖర నరేంద్ర (స్య) నందన' అని చదువుటకు వీలులేదు

డా|| పి. శ్రీనివాసాచార్[14] కొలనుపాక శాసనమును అనువదించుచు మహాదేవుడు వీరభద్రుని అన్నగారనియు, ఇందుశేఖరుడు సోదరుని కుమారుడనియు పేర్కొనిరి. మహాదేవుడు, పాలకొల్లు శాసనములోని విష్ణువర్ధనుడు, ఒక్కరేనని అనుటగాని, రాజకుమార ఇందుశేఖరుని ఇందుశేఖరుని పుత్రునిగ భావించుటగాని అవసరము లేదు. కొలనుపాక శాసనము బంధుత్వమును ఈ క్రింది విధముగ తెలుపుచున్నది :




ఉత్తరేశ్వర శాసనము ఆ బంధుత్వమునే స్థిరపరుచును.




రెండవ ఇందుశేఖరుడు, మహాదేవరాజు పుత్రుడైన ఇందుశేఖరుడు ఒక్కరేననుటకు ఎట్టి అభ్యంతరము ఉండదు. మహాదేవుడు లక్కాంబ భర్తయగు మహాదేవరాజు అయి ఉండవచ్చును. మొదటి ఇందుశేఖరుడు ఉదయాంబ భర్తయును, విష్ణువర్ధనుడని పేర్కొనబడిన వ్యక్తి అతని తండ్రియును కావచ్చును.

ఉత్తరేశ్వర శాసనము వీరభద్రునిగూర్చి ఏమియు తెలుపదు.

కొలనుపాక శాసనము అతనిని పొగడిన పిదప, "జ్యేష్ఠశ్చాళుక్య వంశార్ణ..." అనుదానితో ప్రారంభమగుచున్నది. అది ఎవరికి వర్తించునో స్పష్టముగ తెలియదు. ఆ మాటలకు అనువాదములో "చాళుక్యవంశాంబుధిలో పెద్దవాడు (జేష్ఠుడు) అని కలదు. అతడు కుటుంబమునకు పెద్దగాని, అన్నగారు కాని అయియుండవచ్చును. తదుపరి శ్లోకములో వచ్చునటువంటి 'శత్రుచీకటి కూటమికి వెలుతురు' వంటివాడుకూడ ఎవరికి చెందునో తెలియదు. వీనిలో పేర్కొనబడిన వాడు వీరభద్రుని అన్న అయిఉండవచ్చును. తరువాతి శ్లోకములోనే 'మహాదేవ, లక్కాంబలకు ఇందు శేఖరుడు ఉదయించి'నట్లు పేర్కొనబడినది. "జ్యేష్ఠశ్చాళుక్య వంశార్ణ." వీరభద్రునికి వర్తించినట్లైనచో, మహాదేవుడు అతని తమ్ముడై ఉండవలెను; అది మహాదేవునకు వర్తించిన, వీరభద్రుడు అతనికి తమ్ముడై ఉండవలెను. వీరభద్రుడు భార్యతో వెళ్ళినట్లును, మహాదేవుడు చాళుక్య సీమలను పాలించినట్లు తెలియుటచే[15] మహాదేవుడే పెద్దవాడనుట స్పష్టము. చాళుక్యవంశ క్రమము యీ విధముగ ఉండవలెను :




కొలనుపాక, ఉత్తరేశ్వర శాసనములు రెంటిలోను ఇందుశేఖరుడు కాకతీయ సార్వభౌముని ఆధిపత్యమును అంగీకరించుచున్నాడు. చాళుక్యులు కాకతీయుల పాలనకు లోబడినవారని యిందుమూలముగ స్పష్టమగుచున్నది.

క్రీ. శ. 1262 నుండి 1278 వరకు గోదావరి ప్రాంతమందు కాకతీయ శాసనములు లభించకపోవుట చేతను,[16] ప్రాయికరాజులగు చాళుక్యులు, హైహయులు వారి పేర్లను మాత్రమే వ్రాయించుటచేతను, డా॥ ఎన్ వెంకటరమణయ్య, శ్రీ సోమశేఖర శర్మ ఆ సమయములో ఆ ప్రాంతమందు కాకతీయ పాలన క్షీణదశలో నున్నట్లు తలచిరి.[17] కాని యీ స్వతంత్రపాలన క్రీ. శ. 1278తో అంతమయినదనుటకు ఆధారములేదు. ఆ రెండు రాజ్యములు క్రీ. శ. 1300 వరకు కాకతీయుల ఆధిపత్యమును గుర్తించక వారి పాలనను సాగించినవి.[18]

ఈ శాసనము వీరరుద్రుడు రాజ్యము చేయుచున్నపుడు యీయబడినది. శాసనతేదీ 1290 నాటికి యితడు రాజయ్యెనా అన్నది సమస్య. ఇదివరలో రుద్రమదేవి క్రీ. శ. 1295 వరకు రాజ్యముచేసెనని తలంపు ఉండెడిది. ఇప్పుడు చందుపట్ల శాసనమువలన 1289లో ఆమె మరణించెనని తెలియుచున్నది.[19] అందువలన శాసనము ఆఖరి కాకతీయరాజగు ప్రతాపరుద్రుని కాలమునాటిది.

శాసన ప్రతిగ్రహీతయైన విద్యనాచార్యుడు గొప్ప పండితుడు. అతని పాండిత్యము యీ శాసనము, వినాయకపుర శాసనములోను కొనియాడబడినది. అతనికి యీ శాసనము ప్రకారము ఉత్తరేశ్వరము, మిగత శాసనముల ద్వారా ఓనపల్లి గ్రామము, వినాయకపురము, పులుపర్తులలో కొంతభూమి లభించినట్లు తెలియుచున్నది.

శాసనమునందు చెప్పబడిన కొన్ని స్థలములను మనము గుర్తించవచ్చును—పేకేరు (పేకేరు), ముక్కోమల (ముక్కామల), పులుపర్తి (రెడ్డిరాజుల కాలమునందు అన్నమావరముగ మార్చబడినది; యిప్పటి అన్నవరప్పాడు)[20] ఈ గ్రామము లన్నియు పశ్చిమగోదావరి జిల్లాలోని తణుకు సమీపమున గలవు. ఉత్తరేశ్వరమును గుర్తించుట కష్టము; కాని మిగిలిన గ్రామములతోబాటు యిదికూడ తణుకు తాలూకాలోనే ఉండవలెను. భీమవల్లభపురము పశ్చిమగోదావరిజిల్లాలోని భీమవరము కావచ్చును.

## శాసన మూలము(1)

### మొదటిరేకు-రెండవపెడ(2)

1 ఓం [3] స్వస్తి ॥ ప్రత్యూహ వ్యూహరాశిప్ర భవతు భవతాం శ్రేయసే భూయసే బ్భస్పీ (భూయసాంభస్పీ ?)

2 త్వా ధృత్వాకరం చోపరి విస్పజతి తాన్ వ్యోమ్ని యస్మిన్నురస్మిన్ (1) మందం మందం పతన్త్యః

3 పరిసర శశినం ప్రేమరంగైస్తరంగై రాలింగ్యా లింగ్యపుత్రం



మొదటిరేకు - రెండవ పెడ

వరివధతి సుఖారంభమం

4 బోధయస్తే ॥[1*] బాలః ప్రోలేశ్వరే (రో) నృత్యమాచర న్నైవం స్తుతః। భవతాం భూతయే భూయా

5 దాకంఠం పురుషకరీ ॥[2*] హరీః (రిః) కేలికిరిః పాతు విశ్వం విశ్వంభరాంకిలా। యద్దం ష్ట్ర భాతి

6 చాంద్రీవ కలాకాపి కలంకినీ ॥[3*] శంభోరంభోనిధీనా మనవరత సమల్లా స రక్షాసుద

7 క్షా చాంద్రి ( దీ) సాంద్రీ భవ చ్ఛీజ(జ్జ్ఞ) గదవతు కలా కాపి వౌ లౌ౦శాలే। ఆలీలం వ్యలింగ్య కృష్టాము

8 [4] హురతి చపలై జ్జర్హ్ను కన్యాశరంగె మ్మె ర్తిమే క్రత వాసాది వభ్రశముది

9 తామ్మాచరద్భిశ్చరద్భిః ॥[4 ] పుంసే పురాణాయ నమోస్తు తస్మై యన్నాభిపద్మాదుద

10 భూ-త్స్వయం భూః। తస్మై విధాత్రే చ నమోస్తు యస్మాత్సమస్త మేతజ్జగదావిరాసీత్।[5*] అంగవెం(వం)

11 గ కలింగాంధ్ర కర్నాట మగధాదయః। దేశాః స్ఫురన్తి తత్రైషు మనోజ్ఞం త్వంధ్ర మణ్డలం (వ్రు)॥[6*]

12 త తోల్లసన్తి శతశోపి మహానగర్యస్తాసాం పురీ స్ఫురతి కేవల మోరుంగల్లుః[5]। మ

13 ధ్యే త్రివిష్టపసరోరుహ లోచనానామాద్యామురప్రమథ నాంబుజ లోచనేవ ॥[7*] శంభోః స్వయం

14 భువో యత్ర శిరశ్చంద్ర మరీచయః। కుర్వ (ర్వ)న్తి చంద్రి కోన్నిద్రాః కృష్ణపక్షేపి యామినీః ॥[8*] పశ్య

15 న్తి పురుహూతాంశాం పౌరుహూతి మివ శియం (వ్రు)॥ భక్త్యాయదాతు ముద్యుక్తా యద్రతా వింధ్యవా

## రెండవరేకు మొదటి పెడ

16 సినీ ॥[9*] తస్యామస్తి స వీరరుద్ర నృపతిః పత్యర్తి పృధ్వీపతి (స్*) స్ఫూర్జద్రత్న కిరీట కోటివిహరత్పా

17 దారవింద ద్వయః। శ్రీమత్కాకెత (త్కాకతి) రాజ్యభార వహన ప్రేంఖద్భుజావిక్రమో య

18 స్య త్యాగముదీక్ష్య కల్పవిటపీ వ్రీడాది వాగాద్దివం (వ్రు)[6] ॥[10*] తద్బాంధవః పంకజ బాంధవాన్వయే

19 జాతా (తో) నృపో నామని విష్ణువర్ధనః (।*) యద త్తిర్నో యత్పరిపంథినో ముహుః శ్రియం

20 లభంతె సుర సుందరీమపి ॥[11*] తదాత్మజోఽ భూత్స్వయమిందు శేఖరః ప్రత్యర్థి హాలాహల

21 పానపండితః। దిగంబరవ్యాప్త యశో విజృంభితో విభూతి నిష్పాదిత మాధురీభరః[7] ॥[12*] ఉదపా

22 ది మహాదేవస్తేన రాజ్ఞా మహీపతిః[8]। పశ్యన్తి రిపవో యుద్ధే యస్య ఫాలవిలోచనం[9] ।(।13*)

23 తస్య భాగ్యేన కేనాపి భగ చందుశేఖరః। నృపతి ర్ఘణ్పతి పుత్రః[1] స్ఫూ త్యధిక విక్ర



రెండవరేకు — మొదటి పెడ

24 మః ॥ [14*] యద్దానాంబు ఝరీ ప్రవాహ విభవైః పాథోజ (ద) యోవద్భిర్తా[11] భీతింకామ

25 పి కుంభసంభవ వ(భ)యాజ్యాలాం త్యజంతి ధ్ర(ధ్రు)వం (వ్) (।*) త చంద్రం విహరద్భి యామ్మిక పటలైరన్త

ర్చరత్తైవరీ వి

26 స్ఫూర్జత్తుచకుంభ సంభవ మహామైత్రీ పవిత్రీకృతాః ॥ [15*] తస్మాదలభత గ్రామముత్తరే

27 శ్వరమాఖ్యయా । రుద్రదేవ సుదీర్ఘాత్తుం గురవే గురు దక్షిణాం (వ్) ॥ [16*] సుధాక

28 రం[12] వసు-ధరానీయన చంద్రమః సంఖ్యయామితేషు శకవత్స

29 రేష్వథ విరోధినః ఫాల్గుణే శశిగ్రహణ మందత[13] సగరనే సతామగ్ర

## రెండవరేకు రెండవ పెడ

30 ణీ రదత్త పురముత్తరేశ్వరం సశేష భోగ ఃసహ ॥ [17*] పదవాక్య ప్రమా

31 ణజ్ఞైః బుగ్యజస్సామవేదిభిః । స్ఫురన్తి బహుశో యస్య మందిరాం

32 గణవేదికాః ॥ [18*] హోమధూమైస్సమాకీర్ణైర్జః సాయం ప్రాతర్విహా

33 రిభిః। యత్వరీ విధికాః సర్వాః కుర్వన్తీవ త్యపఃచరం (వ్) ॥[19*] యత్ర గంగాతర

34 ంగాణా మవలోకన కౌతుకం (వ్) । గృహాంగణ తిలోలానా మయత్నాదేవ

35 సిద్ధ్యతి । [20*] లోలకల్లోల హస్తాగ్రలీలాచాలిత పంకజా। గోదావరీ

36 [14] యంయా[15] ధైర్యాద్వర్ణ్యంకతు కామిహాగత ॥[21*] యాముహూ

37 రుద్రదేవస్య తస్యాభ్యుదయకారిణీ । య త్రా సిన యాచా[16]

38 య్యాస్త్రిలకః సోమయాజినాం(వ్) ॥ 22*] జాతః రి యుగం ప్రదష్యం పశిష్టా (ష్టో)

39 ముని పుంగవః (।*) కలుషె కహత్తో మాభూత్కల్కిరి త్యను కంపయా ॥[23*] పద్మాల

40 యా (య)మిహాలోక్య కౌతుకాజ్జనని గిరాం (వ్)। శృంగర భరితా యస్యముఖ

41 పద్మా శయాభవత్ ॥[24*] స్ఫు (భ) లాదివ మహాక్ష్మీ ద్వర్ణపాత్య యస్ముఖ భారతి (వ్) ॥(।)

42 ప్రవిశ్య యద్గృహాన్ సర్వాన్సస్థిరా పంజ్యభరే॥ [25*] జాతం వేతండ

## మూడవరేకు - మొదటి పెడ

43 గండస్కృత పదః కోహణం బ్రహ్మ శ్రీ భంగిభాం(హాం) గృత్వా సొస్పతిర



రెండవరేకు — రెండవపెడ

44 పి వళంసీత (వశిస్టేషు) ఏవాఒత ఏషః। పిత్రోశ్చిత్రోపచ య్యా ముహురపి రచి

45 లా పండితేభ్యో-ఖిలేభ్యో దత్తం విత్తం తదస్మిన్ జగతిభలు కృతి(తీ) రుద్రదేవప్ప

46 ఏవ ॥[26*] యద్దానవయసామోఘై రారబ్దే పాథసాం ః నౌ । కవిసూక్తామృత (ం*)

47 కీర్తి లక్ష్మీః ప్రాదురభూ[ద*]యం (మ్) ॥[27*] యత్కృతం చోద్యమన్యోనో పరిహర్తుంప్ర

48 గల్భతే । యత్కృతే సరిహారేఒపి నాన్యశ్చోదయితుం క్షమః ॥[28*] తక్కేళ తం

49 తమార్గేణా కవిత్వే మధురేఒధవా।యత్రతకృతో (త్రా)పి వా యస్యప్ర

50 గల్బేవ సరస్వతీ ॥[29*] తస్యాస్తి రుద్రదేవస్య గురు విద్యానన[17] దీక్షితః । యస్యాన్న

51 తకరస్పర్శా త్తన్మలివ్యాద్దిన్ వర్ధితా ॥[30*] యదను గ్రహ మాసాద్య సుధీ (థి)

52 యామగ్రణీ రభూత్ ॥(।) విన్తోవాఖ్యానభారేణ రుద్రదేవః కృతీశ్వరః ॥[31*] య

53 స్మిన్నప్యశ్రతి వాక్యోయం విద్వనా చాయ్యలో యదే। శిష్యాప నాలవాలేషు వర్ధంతె భా

54 రతీలతాః ॥[32*] స్పందచ్చందన సౌరభస్య గరిమా మల్లీప తల్లీ శ్రియాం యస్యన్యస్య

55 తి బి(వి) బుధేషు వచసాం మాధుయ్యాదుయ్యాం పదం (మ్) ॥(।) భోగ్యాయోగ్యమహీ

## మూడవరేకు - రెండవ పెడ

56 సుపర్వ నికరై ర్యద్భూతయో సీతయో యజ్ఞస్యజ్ఞస వౌలి విద్వన సుధీ

57 జ్ఞాగత్తి మూత్తః శివః ॥[33*] వేదవేదాన్త ఘంటాభ్యాం విద్యనాచాయ్య సిన్ధు

58 రః । విహితాత్థ క్రియాలానః శేషం వానమనోహరః॥ [34*] సుధా

59 కరకలామిలన్ముకుటమండలం కుండ లీకృతోరగ మురస్థ లీ రచిత భస్మలే

60 పం మహః । విధాయ హృది తత్పరం యమవలోక్య విద్వజ్జనా స్తదేవ

61 పరమం మహః కిమపి మన్యతె మూర్తిమత్ ॥[35*] చతుమ్ము

62 [18] భ చతుమ్ముఖే వ్యరసేప సమన్విప నిరన్తర పరిస్ఫుర స్పవివి

63 రాస పణ్యస్థలి (?) (।*) సముల్లసలి యన్ముఖాంబురుహ మండలం మండనం

64 వ సర్వ సుధీ(ధి) యాం ముహు [స్ప్రహా] రతి విధ, వాయ్యః సుధీ. [19] ॥[36*] కపిముని మత



మూడవరేకు—మొదటి పెడ

65 మ (మా)స్తే యత్ర మైత్రీం రచయతి పంకజ భూకు రంగనేత్రీ । లలిత పదవ

66 దాత్థర్సార్థదాత్రీ మధు మథనాంబుజ పత్రలోచనేవ॥ [37*] రుద్రాచార్యోఽ భవత్త

67 స్మిన్ కపలే పద్మజూరివ । భాషతే పురతః స్థిత్వా యేన పాకం సరస్వతీ ॥ [38*]

68 యమాలోక్య జనాః సర్వే[20] మణిరేకా (కో) గుణోత్కరైః। గదితో వేధసేత్యేవం

## నాలుగవరేకు-మొదటి పెడ

69 సంగిరంతే సవిస్మయాః ॥ [39*] తతోఽభూద్దేవ నాచా

య్యార్యః సౌజన్యామ్బు

70 త వారిధిః । న కదాచిదభూద్యస్మాదభిజన్య హాలాహలః। [। 40*] య

71 స్మిన్ వదతి గోష్ఠి (ష్ఠీ) షు ప్రతివాదిత్వ మద్రిషు । తత్తనూభూర భూద్ధన్యః శ్రీ

72 రంగాచార్య్య[21] కోవిదః ॥[41*] కవిత్వ మాధుర్య్య ధురంధరాణా మాద్య (ద్యో)

73 భవద్యోఽ పి చ[22] శాస్త్రభాజాం (జ్ఞా) । సుధః[23] సురాణామివ చంద్రమౌళిమ్మునీ (ని)

74 మ్మునీనా మివ కుంభయోనిః ॥ [42*] తతో భూద్వి ద్వనార్య్యో యః శంకరా



మూడవరేకు—రెండవ పెడ

75 దివ షణ్ముఖః భాస్వానివో యాద్రీ శావమృతాం శురివో దదే

76 ః ॥ [43*] వాగీశరత్నాకరనామ్నియః పురే వ్యధత్త సమ్య గ్విధి సర్వ్వ తోముఖం (వ్) ॥ (।)

77 మధ్యే సభం యస్య వచో విజృంభితం ముహుమ్ముహుస్సూ (క్ష్మా)జ్ఞ్ణతి సర్వ్వతో

78 ముఖం (వ్) ॥ [44*] యదుపవన శుకానాం క్వాపి లీలా రతానాం పరిసరముపయా

79 తాఃపండితాస్తగ్వచోభిః ॥ (।) విదధతి నిజశాస్త్రే సంశ యోచ్ఛేద శేభ్యో మధు

80 రఫల విశేషా నాదరా దర్పయన్తః ॥ [45*] భీమవల్లభపు య్యాంచ యః క

81 రోతిస్మ సరోవరం (వ్) । శివతీర్త్థ మితి ఖ్యాతం యదంబు వసుధాసుధా ॥ [46*] భీ

## నాలుగవరేకు - రెండవపెడ

82 మవల్లభపురీ విభూషణం యస్తడాగముదపాదయత్ క్షణాత్ ॥( । )

83 విశ్వ (శు) తం హి శివతీర్త్థ సంజ్ఞయా విస్ఫురన్తమివ పుణ్య[24] సంచయం (వ్) ॥[47*]

84 శివజ్ఞానేశ్వరన్తత (జ్ఞానేశ్వరం తత్ర) ప్రతిష్ఠాపయతిస్మ యః।వస్తుద్యేయమి

85 వాత్మీయం కర్త్తుం లోచనగోచరం (వ్) ॥[48*] అగ్ని ష్టోమం కరోతిస్మయః పురే భీ

86 మవల్లభే। య థా విస్మయమాయాన్తి పశ్యన్తః సోమయాజినః ॥ [49*] ప్రా

87 [25]ర్త్థితో యమువనీశకుల ప్రవేశో యస్యాఖిలామల మతీశ్వ రభా

88 గ్యపూర్ణైః । యస్మై కృతం ప్రథమ దర్శన ఏవ రాజ్ఞా[26] కర్పూర

89 పూగఫల భోగ సమర్పణం చ ॥[50*] అదత్తయస్మై స్వయ మాత పత్రం[27]

90 చాందోకాం రుద్రకుమారవీరః । పర్య్యాయ వృతిం పరి హాయ యస్మై



నాలుగవరేకు — మొదటిపెడ

91 తేనోచితం నిష్కశతం చ దత్తం (వ్) ॥[51*] దేవః స్వయంభూరిది యత్రభక్తిం కరోత్యసౌ

92 రుద్రనృపాలమౌళిః । బ్రాహ్మేముహూర్త్తే పురుషం పురాణం ధత్తేన్వహం యో

93 హృదయారవిందే ॥ [52*] అగ్నిహోత్రాద్యనుష్ఠానం పర కుంజర పూజనం (వ్) । స్వయంభు

94 వే నమస్కుర్మ్మః పుణ్యానామావలోకనం (వ్) ॥ [53*] పరస్యమహసో ధ్యానన్ధమ్మః (ధ్యానం ధర్మ్మః) ని

## ఐదవరేకు - మొదటి పెడ

95 ర్మ్మణ కౌతుకం (మ్) । పరోపకారతాత్పర్య్యం మీమాంసా
ద్వయ కౌశలం (మ్) ॥ [54*] వ్యాఖ్యా

96 తుమఖిలాం విద్యా ముత్కంఠా పరిరంభణం ( ।* ) పదక్రమ
యుతేం[28] వేదే నైపుణీ

97 యస్య కేలయః ॥ [55*] శైవాగమేష్వపి చ యోగ నిబన్ధ
నేషు తంత్రెషు మంత్ర విషయే

98 ష్వపి పండితోయః । యో ధర్మ్మశాస్త్ర పరినిష్ఠిత వాగ్వి
లాసః కైలాస వాసిని మ



నాలుగవరేకు రెండవపెడ



ఐదవరేకు — మొదటి పెడ

99 హన్యతి అంపటోయః ॥ [56*] ప్రమేయ చర్చామృత
నామధేయః ।[29] కర్ణామృతం

100 యేనకృతః ప్రబంధః । రత్నాకర సూక్తిమణి వ్రజానాం
స్థాయ్యః సుధీ

101 శాసన పంకజానాం (మ్) ॥ [57*] ప్రమేయ చర్చామృత
మాద్రియన్తే యదబ్దిలబ్ధంసు

102 ధియః సభాసు । తదేవ లబ్ధ్వా జఃబుధ్యయోఽపి భవన్త్య
భిజ్ఞా విజ

103 యోత్సవానాం (మ్) ॥ [58*] విధాయ సార్వత్ర నామ్ని
వారిధావుద్భధమం

104 ధా (దా) చలమిందుశేఖరః । యచ్ఛృద్మనా వీక్ష్య హరిం యశః శ్రియం ప్రమేయచ

105 చ్ఛార్వామృత మాహరద్ధ్రు (ద్దు) వం (వం) ॥ [59*] ప్రమేయ చచ్ఛార్వామృత మపిబన్ యద్వినిమ్మిర్తం భూమి

106 సుధారసత్యం (వం) । సర్వే సమాధాతు మివాత్మషష్ఠం సుదేశ్వరాః సూ

107 క్తి సుధాముచోఽపి ॥ [60*] స విద్వనాచార్య సుధీశ మౌళి ర్లిప్ద్వా తతస్తామవని

108 సురేభ్యః । లదత్త వేద ప్రథిమా శియేభ్యః సమస్త శాస్త్రా గమ తత్వ (త్త్వ) విద్భ్యః ॥ [61*] అ



ఐదవరేకు—రెండవపేడ



ఆరవరేకు—మొదటిపేడ

## ఐదవరేకు - రెండవపేడ

109 స్య గ్రామస్య సీమానః ॥తూర్పున । మూరయుతున్న కోడు ॥ ఆగ్నేయానను

110 ఉత్తరేశ్వరపురము ఓసనత్ర[30] కడమి ఓయ్యానదు ప్పుపుట్ట[31] ॥ దక్షి

111 ణతః । ఉత్తరేశ్వరపురాను కడమి పులుపత్తి ముయ్యని పుట్టు గు

112 ప్రాం గనుధ్య (వు) ॥ నైఋత్యతః । ఉత్తరేశ్వరపురము ప్రేపేటి హెంమేరద్దు [ *]

113 పశ్చిమతః ॥(।) ఉత్త్రరేశ్వరపురము (పేకేటి పొలమేర పుట్టకోడు ।(।*) అనన్త

114 రతః । ఉత్త్రరేశ్వరపురము (పేకేటి ము(కోమల ముయ్యు కు(టుల జమ్మి (॥*)

115 [32] వాయవ్యతః । పెద్దమడ్గు నడుము । (।*) ఉత్త్రరతః। (మోటచిన్తకో

116 డు । (।*) ఈశాన్యతః । గంగాదేవి నడుము । సంగాము తూర్పుర్ణన

117 గంగాదేవి నడుము । సంగాము దక్షిణానను మేడిపుంత । సంగాము మగు

118 డ నుండి దక్షిణమించి రాగాసు మూగూడి కోదు ॥ త ఏతే॥ కుమారస్వామి

119 నిర్వర్ణ (కతుయాజినః । మంచెన సోమయాజినః । తోంట ఘట

120 శాసినః । కేశవ ఘటశాసినః । యజ్ఞనారాయణ ఘట శాసినః (।*)

121 అప్పన ఘటశాసినః ॥ ఏతే హారీతాః ॥ విశ్వనాధ ఘట శాసినః ।

## ఆరవరేకు-మొదటిపెడ

122 కంచి ఘటశాపినః । వామదేవ ఘటశాసినః । శ్రీరంగ ఘట శాసిన

123 ః । కంచి ఘటశాసినః ॥ఏతే కపిగో(తాః ॥ రేమన[33] ఘటశాసినః । విశ్వేశ్వ

124 ర ఘటశాసిన ః । మారె భట్టోపాధ్యాయాః । కామదేవ ఘటశాసినః ।

125 వల్లభ ఘటశాపివః । తల్యె ఘటశాసినః । పోతి ఘటశాపినః పంపయ

126 సోమయాజినః । పురాయి ఘటశాసినః । అన్నక ఘటశాసినః (॥*) ఏతేభ

127 రద్వాజాః ॥ సూరె భట్టోపాధ్యాయాః । శరభ భట్టోపా ధ్యాయాః ॥

128 ఆ(తేయా ॥ రాలిపెద్ది భట్టోపాధ్యాయాః ॥ (।) వెలు పుల పో

129 తి ఘటశాసినః ॥ గౌతమా ॥ అనంత భట్టోపాధ్యాయాః । సూ

130 కన ఘటశాసినః । అప్పన భట్టోపాధ్యాయాః । కేశవ భట్టోపాధ్యా

131 యాః । సూరె ఘటశాసినః । కామదేవ ఘటశాసినః । నర సంహ

132 ఘటశాసినః । దామోదర ఘటశాసినః । రేవన ఘట శాసినః ॥ ఏతే కుండినాః (॥*)

133 కందప్ప ఘటశాసినః । సూరె ఘటశాసనః । పురుషో త్తమ ఘటశాసినః॥

134 ఏతే వాధూలాః ॥ మంచెన ఘటశాసినః । అనన్త ఘట శాసినః ॥ కాశ్య



ఆరవరేకు మొదటి పెడ

## ఆరవరేకు, రెండవపెడ

135 పా ॥దేవన ఘటశాసినః ॥ శరగోత్రః ॥ సర్వదేవ భట్టో
పాధ్యాయాః ॥ శా

136 ండిల్యః ॥ ప్రతిద్విజవరేభ్యః ఖారిత్రయ పరిమితాం భువం
(వ్) ॥ ఇత

137 రత్సర్వ మారాధ్య సర్వ కతుయాజీ విద్దన సోమయాజ
నామేవ ॥ ౧

138 సామాన్యోఽయం ధమ్మ సేతున్నృపాణాం కాలే కాలే పాల
నీయో భవద్భిః ।

139 సర్వా నేతాన్భావినః పార్థి వేంద్రాన్ భూయో భూయో
యాచతే రామ

140 చం దః ॥ [62*] స్వదత్తాం పరదత్తాం పరదత్తాం [34]
వాయో హరేత వసున్ధరాం (మ్) ।

141 [35] షష్టిం వష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః
॥ [63*] స్వదత్తా

142 [ద్వి*]గుణం పుణ్యం పరదత్తాను పాలనం (మ్) పర
దత్తా పహారేణ స్వద

143 త్తం నిష్ప (ఫ)లం భవేత్ ॥ [64*] గామేకాం
రత్నికా మేకాం భూమేరప్యేక మంగులం (మ్) ।

144 హరన్నరక మాప్నోతి యావదాభూత సంప్లవం (మ్)
॥[6? *] శత్రుణాపి కృతో ధమ్మః

145 పాలనీయః ప్రయత్నతః । శత్రురేవహి శత్రుః స్యాద్ధమ్మః
శ త్రున్న క

146 స్యచిత్ ॥ [66*] మద్వం శజాః పరమహీపతీ వంశజా వా
పాపా దపేత మనసో భు

147 వి భూమిపాలాః । తే పాలయన్తు మమ ధమ్మ మిమం
సమగ్రం తేషాం మయా

148 విరచితోంజలి రేషమూర్ధ్ని (మూర్ధ్ని) ॥ [67*] పునరపి
విద్దనాచార్యే (*, రొనవల్లిః పులుపత్తే [36] చత్రి(౦*)

## ఏడవరేకు మొదటిపెడ

149 శత్తారిమితం క్షేత్రం లబ్ద్వా తదుభయ ముత్తరేశ పురేంత



ఏడవరేకు—మొదటిపెడ

భాగ్య విప్రేభ్యోదత్తం (మ్) (।*) తేషాం నామ

150 గోత్రే (।*) విద్దన భట్టోపాధ్యాయాః సార్ద ద్విభాగినః।
రుద్రె సోమయాజినః । ప్రోలె ఘటశాసినః

151 అన్నెఘటశాసినః । పురుషోత్తమ భట్టోపాధ్యాయ సోమ
యాజినః । ప్రోలె భటోపాధ్యాయాః । కేశ

152 వ భటోపాధ్యాయాః ద్విభాగినః । ఎన్నెహితాత భాగినః [37]
వల్లభ సోమయాజినః అర్ధ భా

153 గినః । కచి ఘటశాసినః । నరసింంహ ఘటశాసినః । శ్రీరామ
ఘటశాసినః । తొత్తటి[38] యగ్రె

154 శ్వర ఘ అర్ద (ర్★) భాగీ [39] । యెగ్నేశ్వర ఘ అర్ధర్
భాగీ । మారె ఘ అర్ధర్ భాగీ । జన్నె ఘ పాదోన భాగీ।

155 ఏతే హరితాః । ( । ★) దేవరె భట్టోపాధ్యాయాః । రేమన
భట్టోపాధ్యాయాః । కూచ

156 న భట్టోపాధ్యాయాః । మంచి భట్టోపాధ్యాయాః । నర
సింహ ఘటశాసినః ( । ★)

157 పురాయి ఘ అర్ద్ధర్భాగీ । సోమేశ్వర ఘ అర్ద్ధన్ భాగీ (।★)
కామదేవ భట్టోపాధ్యయా (ః।★)

158 ఎఱపోత ఘ అర్ద్ధీర్ । నరసింహ ఘ పాదీ [40] । విశ్వేశ్వర
ఘటశాసినః । జన్నె ఘటశాసిన (ః★) అర్ద్ధీర్ (॥★)

159 ఏతే భారద్వాజాః । (। ★ ) నూంకన ఘటశాసినః ।
సోమిది [41] భట్టోపాద్యాయాః । విశ్వేశ్వర భట్టో

160 పాధ్యాయాః । గుండిమంచి ఘటశాసినః । దొత్తి ఘటశాసినః
భీమేశ్వర ఘటశాసినః

161 విశ్వనాధ ఘటశాసినః । తోంట సోమయాజినః । చెన్నె ఘట
శాసినః । యగ్నేశ్వర భట్టోపా

162 ధ్యాయాః । నాగదేవ ఘటశాసినః । కనకవెలి నరసింహ ఘ ।
నరసింహ ఘటశాసినః । వి[ద్న*]

163 న [42] ఘటశాసినః । అర్ద్ధీర్ ॥ కందపర్ ఘ అర్ద్ధీర్ । ప్రోలె
భట్టోపాధ్యాయాః అర్ద్ధీర్ । జన్నె భ[43] అర్ద్ధీర్ ।

## ఏడవరేకు - రెండవపెడ

164 కోరెన ఘ అర్ద్ధీర్ । ఏతె కుండ్డినాః । (।*) గోకయ[44]
భటోపాధ్యాయాః । గౌతమాః । (।*) ఎఱపోత ఘటశాసినః

165 । గర్గాః । (।*) కేశవ భట్టోపాధ్యాయాః పాదోనభాగినః ।
సోమనాథ ఘ అర్ద్ధీర్ । జన్నె ఘ అర్ద్ధీర్ (।*) ఏతే

166 అత్రయః । (।*) అన్నె ఘటశాసీ । కామన ఘ పాదీ । ఏతే
లోహిత్రా । (।*) కామన ఘటశాసీ । మారె ఘ

167 టశాసీ । ఏత్రా కాసి(శి) కా । (।*) పోలె ఘటశాసీ । కేశవ
యజ్వా । అర్ద్ధీర్ । నారాయణ ఘ అర్ద్ధీర్ । ఏతే కశ్య

168 పాః (॥* ఉత్తరేశ్వర ఘటశాసీ । శట (ఠ) గోత్రః ।(।*)
జన్నె సోమయాజినః।వాధూలాః।(।*) శ్రీరామభ[45] అర్ద్ధీర్।పు

169 రుషోత్తమ ఘ అర్ద్ధీర్ । విష్ణువృద్ధో(ద్ధా) ॥ కందపర్ ఘ



ఏడవరేకు —రెండవపెడ

పాదీ (।*) భారద్వాజాః । (।*) పెద్దిఘ పాదోన భాగీ
(।*) గౌతమః[46]

170 భరతోర్ద్ధీర్ । సర్వదేవ ఘ అర్ద్ధీర్ । రాధ్యపుత్రో వీర
భద్రోర్ద్ధీర్ । శ్రీమదారాధ్య ర్ద

171 నభట్టోపాధ్యాయాప్తోర్యామాత్యగ్ని ష్టోమ సర్వతోముఖ
వాజపేయ బృహస్పతి

172 [47] సవ(ర్*) మహా వతాప్తోర్యామ చాతుర్మాస్యయా
జిన్నో గహోర ప్రదాతారో ద్వాదశ

173 భాగినః (।*) ఏతే త్రయః కౌ గో తాః ॥ ము క(ర్ ) ండ్డే
శ్వర మహాదేవం ఏం భాగే । ఉత్తరేశ్వర మ

174 హాదేవః త్రిభాగీ ।జనార్ద్దనవల్లభః ద్వీభాగీ ॥ అత్ర చ గ్రామే కుంభకార తైలకారాద్యష్టాద

175 శజాతిభిర్య్యద్దేయం యచ్చాన్యన్మధ్యకం[48] తత్సర్వ్వమేభ్య ఏవ విప్రేభ్యోదత్తం(మ్) ॥ బహుభి

176 ర్వ్వసుధాదత్తా బహుభి శ్చాను పాలితా । యస్య యస్య యదా భూమిస్తస్యతస్య తదా ఫలం(మ్) (॥68*)

177 స్వస్తి శ్రీ దేవ్యై నమః [।*] * ౧

[ఛందస్సు : శ్లోకములు 1, 4, 26-స్రగ్ధరా; 2, 3, 6, 8, 9, 13, 14, 16, 18-25, 27-32, 34, 38-41, 43, 46, 48, 49, 53-55, 63-66, 68-అనుష్టుభ్; 5, 42, 44, 51, 52, 57, 59-61-ఉపజాతి; 7, 50, 56, 67-వసన్త తిలకా; 10, 15, 33-శార్దూల విక్రీడిత; 11-ఇన్ద్రవంశ; 12-వంశస్థ; 17, 35, 36-పృథ్వీ; 37-పుష్పితాగ్ర; 45-మాలినీ; 47-రథోద్ధతా; 58-ఉపేన్ద్రవజ్రా 62-శాలినీ.]

## అధో జ్ఞాపికలు

1. ఈ వ్యాసము వ్రాయుటలో చాల సహకరించిన డా. పి. శ్రీరామమూర్తి గారికి మా కృతజ్ఞతాభివందనములు.

2. రెండు శాసనములలో ఒకటి కోన హైహయ గణపతిది. (భారతి, నవంబరు, 1959) రెండవది : ప్రతాపరుద్రుని వినాయకపుర శాసనము, చాళుక్య ఇందుశేఖరుని ఓనపల్లి శాసనము కలిసియున్నది.

3. శ్లో. 45 "యః ప్రాప్య స్వయ మిందుశేఖరనృపాచ్చాలుక్యవంశోద్భవా దష్టైశ్వర్య్య మదుత్తరేశ్వరపురం గ్రామం మహీభూషణం(మ్)

4. ఎపిగ్రాఫియా ఇండికా, 18వ సంపుటము, పుటలు 346-56.

5 ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ మ్యూజియములోని తామ్ర శాసనములు, 1వ సంపుటము, పుటలు 98-108.

6 ఈ పంక్తులలో విద్యనాచార్యునికి ఓనపల్లి, పులువర్తులలో భూమి లభించినట్లు, అది మరికొందరి బ్రాహ్మణులకు పంచి యిచ్చినట్లు చెప్పబడినది ఈ రెండు యిచ్చినట్లు క్రీ. శ. 1291, 1296 శాసనముల వలన తెలియుచున్నది. అందుచేత యీ పంక్తులు 1296 తరువాతవి.

7. తార్కికుడు లేక, ఘటికాస్థానములోని అధ్యాపకుడు.

8 భట్ట మీమాంస బోధించు అధ్యాపకుడు (?)

9. ఇచ్చటనుండి ఘటశాసికి 'ఘ' అని, భట్టోపాధ్యాయునికి 'భ' అనీ వ్రాయబడినది.

10. దక్షిణ హిందూదేశ శాసనములు (S I I), 10వ సంపుటము, నెం. 360 జుత్తిగ.
" 5వ సంపుటము, నెం.121 పాలకొల్లు

11. ద. హిం. శా., 5వ సంపుటము, నెం. 122 - పాలకొల్లు.

12. కాకతీయ ఆంధ్ర రాజయుగ చరిత్రము, పుటలు, 467, 488, కాకతీయ సంచిక, పుట 57, కాకతీయ బాంధవ్యములు (భారతి, అక్టోబరు, 1970 పుట 34.)

13. కార్పస్, 13, నెం. 25.

14. కార్పస్, 13, నెం. 25.

15 ద. హిం. శా., 5వ సంపుటము నెం. 125 (క్రీ. శ. 1296) 124 (క్రీ. శ. 1298), 127 (క్రీ. శ. 1300) - పాలకొల్లు, కార్పస్, 13, నెం. 25.

16. ద. హిం. శా., 4వ సంపుటము, నెం. 1341,-1342 **A, B**, 1152.

17. దక్కను ప్రాచీన చరిత్ర, పుట 623.

18. ద. హిం. శా. 5వ సంపుటము, నెం. 122, 125- 127.

19. భారతి, మేనెల, 1974, పుటలు 4-7, స్టడీస్ ఇన్ ఇండియన్ ఎపిగ్రఫీ, 1వ సంపుటము, పుటలు.

20. భారతి, అక్టోబరు 1960, పుట 23.

## శాసనమూలము

1. శాసనము, శాసన ప్రతిబింబములనుండి.

2. ఎపి ఇండికా, 38, లో మొదటి పేడ క్రింద చెప్పబడింది. దీని వలన రేకుల వరుసలు, పేడలు మార్చుకొనవలెను.

3. చిహ్నము.

4. ఈ పంక్తి మొదటిలో 1వ అంకె వేయబడి ఉంది. (ప్రతి రేకు,) రెండవ పేడ ఆ రేకు వరుస సంఖ్య ఈయబడినది.

5. అర్ధానుస్వారముగా పరిగణించవలెను.

6. ఎపి. ఇండికాలో 'క్రోధాది వాగాద్దివమ్,

7. 'మేరు భూధర',

8. 'మహిపతిలోని 'మ' వకారముగా వ్రాయబడి, ఒక గీటు చేర్చబడినది.

9 భాల (ఫాల) విలోచనమ్

10. ఎపి. ఇండికాలో 'యత్ర'.

11. పాదోనిధివ్యర్ద్ధికితా.

12. అనుస్వారము అవసరములేదు.

13. ఎపి. ఇండికాలో 'మంగళే'

14. పంక్తి మొదటిలో 2వ అంకె వేయబడినది.

15. యయా

16. రెండు గీట్లు వ్రాయబడినవి, కాని అవసరములేదు.

17. ఎపి. ఇండికాలో అన్ని చోట్ల విద్దనగా చదువబడినది

18. పంక్తి మొదట 3వ అంకె గలదు.

19. విద్దనార్య్యాగ్నస్సుధీః

20. జనాస్సర్వేన్

21. ఎపి. ఇండికాలో 'శ్రీకంఠాచార్య్యన్' అని చదువబడినది. కాని 'శ్రీరంగాచార్య్యా' అని వినాయకపుర శాసనములోనూ (68వ పంక్తి), ఓనపల్లి శాసనములోనూ (131వ పంక్తి), కోన గణపతి ఖండవల్లి శాసనములోనూ (11 - 12 పంక్తులు) కూడా చెప్పబడినది.

22. ఎపి. ఇండికాలో 'శివద్యోనవ'

23. సురన్

24. పుణ్యా 3

25. పంక్తి మొదట నాలుగవ అంకె.

26. గీత అనవసరము.

27. అనుస్వారం అనవసరము.

28. "

29. గీత అనవసరము.

30. ఎపి. ఇండికాలో 'ఊటపల్లి'

31. " 'ఘట్ట'

32. పంక్తి మొదటిలో 5వ అంకె.

33. ఎపి. ఇండికాలో 'కామన'.

34. మాట అనవసరము

35. పంక్తి మొదట ఆరవ అంకె.

36. ఎపి. ఇండికాలో 'దాచపల్లి పులుపర్రో'

37. ఎ. పి. ఇండికాలో 'పెన్నే పాదార్ధ్ధా భాగః'

38. " 'తాటవి'

39. " 'పాదార్ధా భాగే'

40. " 'పాద్దా'

41. " 'సోమదేవ'

42. " 'వీరన'

43. " 'మన్నెఘ'

44. " 'గోరయ'

45. " 'ఘ'

46. " 'గోమ'

47. పంక్తి మొదట 7వ అంకె.

48. ఎపి. ఇండికాలో 'యచ్ఛాన్య వ్యకం'. మధ్యకమే ఉండవచ్చును వినాయకపుర శాసనములో 'మధ్యక' మనిఉన్నది, మధ్యకం = ఉమ్మడి ఆస్తి.



# ఆత్మా - ఆవేశం

## శ్రీ రామా చంద్రమౌళి

చేపలు గాలాన్ని మింగడం నేర్చుకుంటున్నాయి - యిక్కడి
పసిపాపలు కాలానికి
ఎదురీదడం నేర్చుకుంటున్నారు.
ఇన్నాళ్ళూ —
మంచుదీపంలో మండని వత్తిని
అంటించేందుకు ప్రయత్నం జరిగింది
ఇప్పుడు
కండల్లోనుండి కాంతి,
కన్నుల్లోనుండి విక్రాంతి
ప్రవాహంలా పరుగెత్తుకొస్తున్నది
గతం ఓ మసకపట్టిన అద్దంలా...అందులో
నా ముఖం దయ్యం నీడలా—నేను
చీకటిని చీల్చుకుంటూ
కంకరరాళ్ళ బాటపై నడచీ నడచీ వచ్చి
నా పాదాలనుండి...గుండెల్లోకి చిమ్మే నెత్తురు బొట్టును
ఆ మబ్బు తునకపై ఎర్రగా దిద్దుతే,
నాలోని ఆత్మా—ఆవేశం గడ్డకట్టి
సూర్యుడు నిప్పుబంతిలా ఉరికొస్తున్నాడు.
నేను —
హృదయంలోనుండి కాంతిదారాన్ని తీస్తూ
ప్రపంచాన్ని నాలో దాచుకునేందుకు స్వర్ణాంబరాన్ని నేస్తున్నాను
ఇక్కడ...సంధ్యా, నిశీధులు లేవు
అంతా ఉషఃకెరటాల వెలుగుతుంపరే
ఈ కాంతిని తాగి కలలుకంటూ పడుకున్న నాకు
ఎవడో పిచ్చి వేటగాడు
వెలుతురు పిట్టలపై వేసిన వలను
కలిసికట్టుగా పెట్టుకుపోతున్న దృశ్యం రమ్యంగా కనబడుతోంది

# నాకూ ఓ మనసుంది

## శ్రీ వాడపల్లి విజయ భాస్కర రామారావు

పన్నెండింటికైనా ఆఫీసుకు వెళ్లకపోతే ఆఫీసర్‌తో గస్సాలా తప్పదు. రైలేమిటి, ఇంత మెల్లగా వెళుతోంది ?

—వాచీముళ్ళు చూస్తుండగానే జరిగిపోయి పదిన్నర చూపిస్తున్నాయి. జేబులో సిగరెట్లు చాలా సేపటి క్రిందే అయిపోయాయి.

రైలు ఆగిపోయింది.

''కాస్తదిగి కనుక్కొనివస్తా, సామానుమీద ఓ కన్ను ఉంచండీ'' — కళ్ళజోడు అమ్మాయితో చెప్పి రాళ్లమీదకు దిగి గార్డుపెట్టె వరకూ నడిచాను.

''ఇంజన్ ఫెయిల్ అయింది. వాల్తేరునుండి మరోటి రావాలి.''

''అతి దగ్గరఉన్న స్టేషన్ కోరుకొండ. మనిషిని పంపుతారా?'' నా ఆత్రం గార్డును నావైపు పరీక్షగా చూసేటట్లు చేసింది.

''మీరు కంగారు పడకండి మాష్టారూ, మాపద్ధతులు మాకున్నయ్. మరో రెండు గంటల్లో ఇంజన్ వస్తుంది.'' — గార్డు గొంతులో కొంత విసుగూ, కించిత్ వైరాగ్యమూ వినిపించాయి.

ఓలెవెల్ క్రాసింగ్‌మీద ఆగిపోయింది హౌరా–హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్.

రెండు గంటలు.

అంటే వాల్తేర్ వెళ్లేసరికి, పదిన్నర — ఇంజన్ రావడానికి రెండుగంటలూ, వచ్చి వాల్తేర్ వెళ్లడానికి మరో గంటా వెరశి మధ్యాహ్నం రెండయేటట్టుంది.

గొంతుతడి ఆరిపోయింది.

దూరంగా మర్రిచెట్లూ, ఎదురుగా నుయ్యీ కనపడుతున్నాయి.

కంపార్టుమెంటు దగ్గరకెళ్ళి కాసేపు తిరిగొస్తానన్నమాటని రెండుగంటల వార్తకి జోడించి చెప్పి మర్రిచెట్లు నీడవైపు నడిచాను.

నూతిదగ్గర తాటాకు 'రేక' తో నీళ్ళు తోడుకుని మొహం కడుక్కున్నాను. చెట్టుక్రింద పాకలో టీ దుకాణం కనపడింది.

''మంచి టీ చెయ్ !'' దుకాణం ఆసామీకి చెప్పి రుమాలుతో ముఖం తుడుచుకున్నాను.

గాజుగ్లాసులో జర్మన్ సిల్వర్ చెంచా గటగట లాడిస్తూ, ''బండి ఆగిపోనాదేటి బాఁవూ !'' టీకొట్టుయజమాని పలకరించాడు.

''ఆఁ!'' — దూరాన్న లేస్తున్న గోడలవైపు చూస్తూ పరాకుగా జవాబు చెప్పాను. నాతోపాటు అతనూ గోడలవైపు చూశాడు.

''ఆగిపోద్ది బాఁవూ, ఆగిపోద్ది. మనం ఆగాలనుకుంటే ఆగదు.''

అతని మాటలలోని దైన్యం నా గుండెల్లో గుచ్చుకుంది.

''ఎందుకలా అంటున్నావ్ ?'' అప్రయత్నంగా అడిగాను.

అతని సమాధానం మొదలైంది మొదలు దూరంగా ఇంజన్ కూత వినేంతవరకూ మంత్ర ముగ్ధుడిలా అతనివల్లాపన విన్నాను.

ఆ వృత్తాంతం అతని భాషలో అతను చెప్పినంతశక్తివంతంగా చెప్పగలగడం అసాధ్యమని నా నమ్మకం. అతని ఆక్రందనా, ఆవేదనా అర్థంచేసుకోగలిగినందుకు ఇంకోళ్ళకి చెప్పకపోతే నాదీ ఓ బతుకేనా ? మనసున్న మనిషి చెప్పకుండా ఉండలేని కటిక కన్నీటి వ్యథ.

*          *          *

దురగాలమ్మ గుడీసుట్టూ సదిచ్చన సేస్తంది రెండు సేతుల్తో కోడిపెట్ట నొట్టుకుని గైరమ్మ. ఈరాసావి సేత్తన్నాడు కొడవలొట్టుకుని. మూడు సుట్లయినాక దురగాలమ్మ దెగ్గిర దండాలెట్టారిద్దరూ.

''దురగాలమ్మతల్లీ, నా సంటోడ్నెలా సూత్తావో !'' మైమరిసిపోనట్టు మొగవెట్టేసిందల్లాలు.

ఓసిటంసూసి ' హుఁవు'' అన్నాడీరాసావి

''రాయే పెట్టనెట్టుకో !'' అన్నాడు మరోసిటంసూసి.

కోపంవైపోనాది గైరమ్మ. మొగం దురగాలమ్మకేసి తిప్పేసిండు ఈరాసామి.

సేతులెత్తి పెట్టను దురగాలమ్మకు సూపించుకుంది

జిగేని మెరుస్తున్న కొడవలి కాసాకపాలీ, పెట్టమెడకాసాకపాలీ సూసి కరకరలాడించేసేడీరాసామి·

సేతులెత్తి దండాలెట్టారిద్దరూ.

—బుల్లిగాడు మాత్రం సోద్దెంగా గిలగిల కొట్టుకుంటున్న మొండెం ఏపు సూత్తన్నాడు.

బొబ్బెణ్ణెత్తుకుంది గైరమ్మ.

ఎనిమిదేళ్లొచ్చినా ముచ్చటగా నోరు మెదపనేడు బులిగాడు అడంటే దానికిపేనం. ఎవరూ సూడకుంటా ఎత్తుకుని ముద్దులోడుతాది.

బొట్టిడికి మాయదారి రోగం ముంచేసి రెండేళ్లైపోనాది. మాటొడిపోయిందన్నాడు నాయిజ్జుడు. మాటేకాదు నడిపోత. గొంతూ సెడిపోనాది. గుటక పడక తికమడొడిపోతాడు. నోట్లో నిం బెట్టుకున్నా కిందకి సగం కారిపోతాది. పిడికిడు మెతుకులూ, బుక్కెడు గంజీ ఆడికెట్టడానికి గంటొడతాది. ఆడికోసం కొడుకో కొడుకో అని గిలగిల్లాడుతాది గైరమ్మ.

ఈరాసామికి ఏదో పరాకు, మనసులో ఏదోసిరాకు. గైరమ్మను సూత్తే మతిపోతాది. సేపంవెట్నేనట్టు బుల్లిగాడికి సుస్తీసేసిన రెండేల్లు తిరక్కుండానే టపీటపీమనిపోనారు మల్లమ్మా, నాగులమ్మా.

మంచం వెక్కపోనేదు గాని కునుకెట్టడం మానీసింది గైరమ్మకి. గైరమ్మకి అండ లాటాకులింటి సూకాలు. శోకాలెడుతూ ఎఱ్ఱసెరువుపుత్తర గట్టునున్న ఏపసెట్టుమీది దెయ్యం బిడ్డల గొంతు నులిమిందని పూనకంలో సెప్పింది.

సూకాలికి గడిగడికీ పూనకం వొత్తానే ఉంటాది.

ఏపసెట్టుమీది దెయ్యం ఈరాసామి కొనుక్కుప్ప గుడిసిలోని కన్నెపడుసు గైరి. గైరికి ఈరాసామంటే పేనం అని సెబుతుంటాది సూకాలు.

గైరమ్మలో గైరి పోలికలు సూసుకోడం నేర్చుకున్నాడీరాసామి. గైరి సావెనకాల నిజం సూకాలు పూనకంలో ఓనాదు పొక్కిపోనాది.

అయ్యాలాదివోరం. ఐదేళ్ల మల్లమ్మెలిపోనాది సారగానికి. గడపమ్మీద సోకాలెడుతున్న సూకాలు నేచి నుంచుంది. కళ్లు సింత నిప్పుల్లా కణకణలాడిపోతున్నాయ్.

నీ సిగదరగా, గైరీ, నీకు నేకపోతే నేకపోయె. ఎవడికేడి అను బోగమో. వట్నుంవెల్లిపోయినోడు ఎల్లేపోనాడు. అడిమీద మనసు సంపుకోనేక డిని బొట్టెని పొట్టనెట్టుకుంటావాటే! నీ జిమ్మడ! గైరమ్మనాంటి మనసుందే? ఏనాడైనా నీమీద ఏటైనా అనుకుందా? ఈరాసామి నీకేటి దోహం సేసినాడనీ, కచ్చవేసుకుంటున్నావ్! కులికి నన్నాళ్లు కులికేవ్! నీ పేనం తీసుకోనన్నాడటే ఈరాసామి. నంజకానా, గైరమ్మ వుసురు నీకు తగలకుండుంటాదా? దయ్యావై సాదిస్తావటే, నీ సిగదరగా!''

సూకాల మాటవిని మానివిడి తోటలోకీ జారిపోనాడు ఈరాసామి. శివాలెత్తిన అమ్మోర్లా నాలిక సాపుతున్న సూకాలేపు సూసి దిక్కు తోచనేదు గైరమ్మకి.

- ''నానేటి సేత్నునోయ్ బగమంతుడా, ఈ గైరెవర్తిరోయ్–దెయ్యం దెబ్బతినీసేవ్ కూతురోయ్!''

తల్లికాసి సూస్తూండిపోనాడు బుల్లోడు. రెండు కన్నీటి బొట్లు అడి నోటమ్మటొచ్చే చొంగతో కలిసిపోనాయ్.

మరో నెల తిరగనేదు. నాగులమ్మకి ఒల్లమాలిన సలపరం. ఒళ్లు మరిగిపోనాది. మూసిన కన్నెత్తనేదు. చెల్లిమల్లెమ్మ ఎఱ్ఱి సూపు సూత్తండగా గూడేపు తిరిగిపోయిన నాగులమ్మకు అపస్మారం ఒచ్చి ఒళ్లు అంపరమెత్తేటట్టు గావుకేక లెట్టేపినాది. ఒంటిమీద ఒడ్లగింజేస్తే పేలగింజవుతోంది.

''ఓలమ్మో! నాగులికి పాము కరిసేసిందోలమ్మో!'' అని కెవ్వును కేకేసి కళ్లు మూసేసుకుంది.

ఈరాసామి కొక్కపాలి తెలివి తెల్లారిపోనాది. సైకిలేసుకుని యిజీనారం లగెత్తుకెళ్లాదు డాట్టు దెగ్గిరికి.

కారేసు కొచ్చేడు సంజీవి డాట్టు. ఎనకకంపోడ్రూ ఉన్నాడు. బాసలో ఏదేదో అన్నాడు. సూదిమందు లిచ్చాడు. మూడు గంటల సేపు బొట్టికాడే కూకున్నాడు. గైరమ్మకి ఒక సిటం ఊపిరాడనేదు. ఇటు డాట్టు సేవ, అటు బొట్టి సేవ.

పొద్దుకూకులా కూకున్న డాట్టు నాగులమ్మమీద గుడ్డకప్పి మరీ ఎల్లిపోనాడు, ఆ రేత్తిరికి మల్లొచ్చింది సూకాలికి పూనకం. ఊరంతా అట్టుడికిపోనాది.

''అవునేగైరీ, నీకేటి పోయికాలవంటే, ఆడికాడికి పోయుంటే నిన్నెవడడుగునే, నంజకా, ఆడి నాబిడ్డల్ని పొట్టనెట్టుకుంటావటే-

ఆడు నీ బిడ్డని సంపుకోమన్నాడంటే, ఆడికరమాన్నాడెల్లిపోనాడు. కులికిన గుడిసేటేవి ఆడితో సెప్పొద్దూ పీకలమీద కొచ్చిందని, యిజీనారానినే ఈడనే ఏళ్లా, గెడ్డలా ఎలి సెప్పనేకపోనావా? ఇదేటిదే, ఇలా అందర్నీ పొట్టనెట్టుకుంటావుటే, ఆ ముగనాయాలు ఆణ్ణి తీసుకుపోరాదటే, నోరునేక పడున్నాడు, రతనంనంటి బొట్టి, దీన్నెత్తుకుపోయేవే, నీ సిగదరగా!''

ఆకాసంనోకి సూత్తుండిపోనాది గౌరమ్మ.

ఈరాసామి కంటతడి ఇగిరిపోనాది.

గౌరమ్మలో గౌరినిసూసుకునే ఈరాసామి నూకాల పూనకం లోని పేలాపన విని గౌరిమీద మనసులో సేదు నింపుకున్నాడు.

పూనకం విడిసేసిన తరువాత తనకు తెలిసిందంతా గౌరమ్మకి సెప్పేసింది నూకాలు.

—ఈరాసామిమీద రంగైపోయింది గౌరి. ఉన్నట్టుండి ఈరాసామి యిజీనారాం ఎల్లిపోనాడు ఫేక్టరీలో పన్జెయ్యడానికి. అంతే మరి రానేదు. ఆడికోసం సూసి సూసి రెండెల్లినాక నూతులోడిపోనాది గౌరి. నీళ్లమింగేసింది నంజ కడుపుబ్బి పోనాదన్నారందరూ. గౌరి తల్లెప్పుడో పోనాది. తండి మంచవొట్టిపోయి గుటుక్కుమన్నాడు. గౌరి తమ్ముడు కొంపమ్మేసుకుని పట్నం వెల్లిపోనాడు. ఈరాసామి కొంపకొనుక్కుని నిన్ను కట్టుకున్నాడు.

ఈ మాట విన్నాక మరి ఆడితో నిద్దర పెయ్యనేదు గౌరమ్మ.

నూకాలికీ బాదగానే ఉండేది గౌరమ్మ ఒరస. సోకాలెడుతూనే ఉండేది గడపమ్మీద కూకుని. గౌరిని సేపనాకారాలెడుతూ.

''గుడిసెటి నంజా, నీ జీవానికుసూరుమంటూ ఇద్దరు బొట్టెల్నీ నీ కర్పించి ఆ రోగిష్టిదానికోసం పేనాలెడుతుందే బొట్టి, గౌరమ్మ. కంటికున్నుకు నేదు. నీ కచ్చ తీరునుకోడానికి ఆ బుల్లోడి నొదిలీసేవ్ గదే, మరి గౌరమ్మకి సుకంనేదా?''

—ఎండ బడొచ్చిన బుల్లోడీ మాటలిన్నాడనీ, ఆడికొక మనసుందనీ తెలుసుకోలేక పోనారెవరూ.

—ఇది చెవినబడ్డ గౌరమ్మ తోక తొక్కిన తాచులా లేచింది.

''బుల్లోడినవకప్పా! ఆడికరమ, నా కంటంనో పేనవుండగా ఆడి కేనోటూ సెయ్యను. —ఆడే నాకన్నీ. బొట్టోడి మీది మమకారంతో ఈరాసామి కళ్లల్లో నీళ్లు నిండేయ్.

— నూకాలప్ప సెప్పింది నిజం. దీని సిగదరగ తనమీద

కచ్చకొద్దీ గైరమ్మనీ బొట్టిల్నీ సతాయించి సంపుతోంది. పిల్లల్ని తినేసింది. తనేనేటి తెలివి తక్కువోడు!

అర్ధరేత్తిరి మెరుపులాంటాలోసనొచ్చి దిగ్గున మంచంమీద లేచికూకున్నాడిరాసాఁవి.

"ఒలేయ్!"

బొంతమీదనుంచే అడిగింది కునుకు మరిసిపోయిన గైరమ్మ ఏటిమాఁవా?"

'ఇక దీని ఆట కట్టించేత్తా, పద రేపే ఎఁదాం కొత్తూల్లు. ఐనాత వయిజ్జుని కాడికి. దీని పని పట్టించేత్తా. పడవటింటి పోలా మూర్తిన బావతు మూడొంధలూ బట్టుకెళదాం."

—బుల్లోడికి ఒయిజ్జుడంటే కారుమీదొచ్చిన డాఁటేగేసకం.

మాట పదార్లుచ్చుకున్నాడు పంతులు. కరుసులైనాయి మరో ఒంద. నాలుగురోజులైపోనాక ఒయిజ్జమైపోనాది ఇంటికెల్లి పొమ్మన్నాడు.

గైరమ్మ కొండందుకుంది. పీడ ఇరగడైతే బుల్లిగాడికి మామూలు మాట రావొచ్చు. బుల్లిగాణ్ణి మేట్టరు కాడెట్టాల కొత్తూల్లులో బయల్దేరేముందర పలకా పుల్లకొంది. కుసింత దూరం ఒచ్చినాక యాదస్తొచ్చి ఎనక్కెల్లి ఓ పిట్టొడు పుల్లలుకొంది. ఓ రెండు కమీజులూ, రెండు సెడ్డీలు కొంది. బగమంతు డిచ్చిన కాడికి బొట్టిడికేనోట్లూ నేకుండా సూసుకోవాల.

అబ్బ! ఇక గైరి పోరొదిలినట్టే —

ఈరాసాఁవి దోవలో టీకొట్టుకాడ టిపినూకాపీ ఇప్పించినాడు గైరమ్మకి. సాలోజులికి తృప్తిగా ఎంత తిన్నాడు. సిలిపిగా మెరుస్తున్న కళ్లతో గైరమ్మకేసి సూసినవ్వేడు. గైరమ్మ బొట్టిడికేసి సూసింది.

—'అమ్మో', గైరమ్మకి మాత్తరం తెలిసేబాసలో అడిగాడోనాడు.

"ఏట్రాబుల్లీ!"

"మరేంనేదే, మనింటోనూ ఓ బుల్లెమ్ముంటే ఎంత బావుంటాదే," నూకాలప్ప బొట్టిగూనంత కడుపుతో ఒచ్చి వొరంగ వెల్లకుండా గిల్లినెత్తుకుంది

విట్టూప్సి ఆడి తల నిమిరింది గైరమ్మ.

ఆమె సారానికి అరదం తెలుసుకోనేకపోనాడు బుల్లోడు.

గైరమ్మ కా ఆలోసనొచ్చినప్పుడల్లా బుల్లోడిని గుండెకద్దుకుంటుంది.

— రైలుపట్టాలపక్కబడి నడుస్తున్నారు ముగ్గురూ! ఈరాసాఁవి సేత్తో టంకు పెట్టి మునకాలక్రరా. గైరమ్మసేతిలో సంచీ బుల్లోడు మెల్లగా నడిసొస్తున్నాడెనకాల.

తుప్పెనకాల కెల్లింది గైరమ్మ.

ఇదిగో ఈ భూతంవే లగెత్తుకొచ్చింది. ఓసిటంలో అంతా జరిగిపోనాది. బుల్లోడు రెయిలుకింద నలిపోనాడు. తలకి తలా, మొండేనికి మొండెఁవూ. బండి ఆపనైనా ఆపనేదుబాఁవూ.

— బావురు మన్నాడు టీకొట్టుమనిషి.

చెమటలు కక్కుకుంటూ వచ్చాడు మరో మనిషి దూరాన్న లైను దగ్గర్రే కడుతున్న గోడల దగ్గిర్నించి. మన్ను కుమ్మిన కాళ్ళు నూతి దగ్గర కడుక్కుని మళ్ళీ వచ్చాడు కొట్లోకి.

"ఈరాసాఁవీ! ఓ రెండు పుణుకులెట్టు!"

ఆశ్చర్యంగా తలెత్తి చూశాను.

పుణుకులు ప్లేట్లో పట్టుకుని ఓ మూలకెళ్లి తింటున్నాడు మన్నుకుమ్ముతూ వచ్చిన పనివాడు

కొంచెం తటపటాయించి మళ్ళీ ప్రారంభించాడు ఈరాసాఁవి.

"అసలు గోరం తమరింకా ఇననేదుబాఁవూ; మీరు. గైరమ్మ మతి పోయినట్టయిపోనాది. అదే రేత్తిరీడనే ఒచ్చి గూడ్సుకింద పడిపోనాది...నాకు ఇక కొంపెందుకు బావూ! అన్నీ ఒదిలేసుకున్నా. ఈ కొట్టు కొనుక్కుని, నా గైరమ్మనీ, నా బుల్లోణ్ణీ సూసుకుంటూ కూకుంటున్నా, పొద్దుగూకులా! - అదిగో పేరంటాలు గుడి లేచిపోతోంది."

కళ్లొత్తుకుంట్టూ "పీరాస్వామీ, నీకు భగవంతుడే అన్యాయం చేశాడు" అన్నా. కరుణార్తుడికి నిస్పృహాయి చూపించే మొండి చెయ్యిలాంటి శుష్క పియం, ఊరడింపుమాట

అవసరానికి ఆగని రైలు, నా అవసరం దాటాక బద్ధకంగా ఆవులించి కదిలింది.

# శాంతీ!

డా. గంటి శ్రీరామమూర్తి

నగరానికి దూరంగా
మెల్లగా వెన్నెల వెల్లువ ప్రవహించే పర్వత సానుప్రదేశంలో
నిర్మలాంభ పూర్ణ సరఃకాసార పరిసరాల్లో,
నా చిన్నారి తాళపత్ర కుటీరంలో
నిశ్శబ్దంగా
నిశ్చలంగా
చిరకాలంగా
నిరీక్షించా
నీ కోసం
శాంతీ!
ప్రత్యగ్రఘనాగ్రి బిందు సందోహబందీకృత కాంతి గోళాల్లో
బాలభాను తరుణారుణకిరణాంగుళా స్పర్శచే
ఎరుపెక్కిన ఉత్తుంగ శృంగ సుప్రశోభితపోల బాగాలలో
నిరంతర పవమాన కంపిత రోజారమణి రమణీయ
ఉదయాస్త కాంతి రేఖల్లో,
అఖండ సస్యశ్యామల క్షేత్ర సుషమా వీథుల్లో
సముద్ర తరంగాల్లో
గుహాంతరాళాల్లో
గాలించా నీ కోసం
ప్రలపించా
విలపించా
శాంతీ!
పవనాశ్వపు వేగంతో
పయనించా కకుబంతం
శోధించా ఆకాశపు దారులన్నీ
శోధించా మబ్బు కోనల
శోధించా శక్రధనుర్వక్ర రథ్య
శోధించా ఉషా రేఖ, సాంధ్యరోచి
శరత్కాల శశిమరీచి
సాగిపోయి ప్రభాళితో
వేధించా నుడురాజిని
వేధించ, శోధించా
విలవిల విలపించా
విఫలినై నీ కోసం
శాంతీ !
ఇందు ముఖుల అందమందు
కందునైన కవితలోన
కళా కన్య కేళిలోన
పేదవాని నవ్వులోన
పసి పాపల మిసిమిలోన
దివానిశలు శోధించా
తపియించా
కృశియించా
శాంతీ!
విరతి లేక, విసిగి, విసిగి,
వేసారిన కను గవతో
నింగి నుండి నేలకు దిగి
ఒరిగిపోతి, నగరిలోని
శృంగాటక మధ్యమందు
ఇంతలో, ఆశ్చర్యం!
నా లోపల కనిపించిందొక
నీలతోయద సముద్భూత తటిత్కాంతి
ఆ తటిత్కాంతి గర్భంలో
నిశ్చల నిరుపమ రూపంతో
కనిపించావివహా
శాంతీ !
నా అపార శబ్ద సంచయం అశక్తమైంది నీ నిరుపమాన రూపం
వర్ణించడానికి
నా అపూర్వ భావనాశక్తి అసమర్థమైంది నీ సురుచిర రూపం
రూపించడానికి
అనిర్వాచ్యమైన నీ సమక్షంలో
తీవ్ర ఝంఝూనిలాకంపిత తరుపత్రం
వాతోపశమనంతో ప్రకంపంగోల్పోయినట్లు,
భీష్మ గ్రీష్మతపంలో సలసల కాగే దేహం
శీతవాతోర్మికా స్నానంతో ఒక్కసారి శీతలించినట్లు
బుద్ధి మనస్సు ఒకదానితో నొకటి తాదాత్మ్యం పొందినట్లు,
దేహేంద్రియాలేకేంద్రియమై ఆత్మలోలయించినట్లు,
ఒక నవచైతన్యం చటుక్కున వికసింపగా
మనో నేత్రం చల్లగా మెల్లగా మేల్కొనగా
నావేసారిక నేత్ర యుగ్మం ముకుళించింది
దేహమంతా కన్నులై నిన్ను వీక్షించింది.
హృదంతరాళంలో ఉన్న నిన్ను
విశ్వాంతరాళంలో వెదికిన
తన మౌర్ఖ్యాన్ని మౌనంగా నిందించింది
ఆనందం మోసులెత్తగా
సర్వాంగం పులకించింది
ఆత్మ నెమలియై నర్తించింది.

---

# సంశోధిత మహాభారతము - అప్పకవి పాఠములు

కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు

లక్ష్యమున్న గాని లక్షణ మేర్పడదనుసూక్తి ననుసరించి. తెలుగు బాషలో నన్నయ భారతావతరణమునకు తరువాతనే కవి జనాశ్రయమను ఛందోలక్షణ గ్రంధమును, ఆంధ్ర బాషాభూషణమను వ్యాకరణ లక్షణ గ్రంధములు వెలువడినవి[1] వీనిలో ప్రస్తుతము మనకు కావలిసినది ఛందోలక్షణ గ్రంధము. కవిజనాశ్రయకారుని కాలము నుండి లాక్షణికులు యతిప్రాసల పరిణామమును తమ తమ కాలములకు ముందు లభించిన కవిప్రయోగములనుబట్టి లక్ష్య లక్షణములను సమన్వయముచేసి, నన్నయాది పూర్వకవుల యతిప్రాసలను సంరక్షించిరి.

కాని క్రీ. శ. 1656లో అప్పకవి నాటినుండి కవి ప్రయోగ సంప్రదాయసిద్ధమైన యతి ప్రాసల విషయమై యొక భిన్న సంప్రదాయ మేర్పడినది.

అప్పకవి "ఆంధ్రశబ్ద చింతామణి"[2] యను తన లక్షణ గ్రంధమున—నన్నయభట్టు యతిప్రాసలను గూర్చి చర్చించుచు నిట్లు వ్రాసినాడు.

"నన్నయ ముఖ్యసత్కవి జనంబుల కావ్యములందు లేఖకుల్
గొన్నియుఁ బాఠకాధములు గొన్నియు బోకడవెట్టి తక్కువై
యున్నెడగాంచి జానపదు లోడకదిద్దిన తప్పుతోవలె
ల్లన్నిజమంచు గైకొనిన లక్షణ వేత్తలు సమ్మతింతురే
(3-203)

ఇట్లు వ్రాయుటయేగాక, "బహుపుస్తకంబులు పరీక్షించి వానినెల్ల బ్రక్షిప్తంబులుగా నెఱింగిన వాడనై" యని కూడ స్పష్టముగా చెప్పినాడు.

ఇందువలన అప్పకవి నాటికి తాళపత్ర ప్రతులలో భారత పాఠములు ప్రక్షిప్తములని యర్థమగుచున్నది.

ఈ అప్పకవి వ్రాత సత్యాసత్యములను పరిశీలించుటయే యీ వ్యాసోద్దేశము.

## భారత పాఠములు—అప్పకవివ్రాతలు

అప్పకవి తాను బహు పుస్తకములు చూచినాడనని యన్నాడు గదా ఎన్ని చూచినాడో చెప్పలేదు చూడకుండగనే దిద్ది క్రొత్త పాఠములు కల్పించినాడని ఈ క్రింది విషయమునుబట్టి నిస్సంశయముగా చెప్పవచ్చును.

సంశోధిత మహాభారత ముద్రణము.

ఉస్మానియ విశ్వవిద్యాలయమువారు—౧౫ యేండ్లనుండి తెలుగున ప్రచారముననున్న భారత తాళప్రతులు తెప్పించి వానిని కాలక్రమమున నేర్పరచి అందు 25 ప్రతులు ప్రదానముగా గ్రహించి, తక్కిన వానిని సంప్రతించుచు, పాఠభేదములను ప్రదర్శించినారు.

సంశోధిత ముద్రణమున పై తాళపత్ర పాఠ ప్రదర్శనము ముఖ్యముగా నన్నయ యతిప్రాస సంప్రదాయమును నిర్ణయించుటకు మనకెంతో తోడ్పడుచున్నది. సంశోధిత ముద్రణమున నన్నయ భారతము-ఆది సభా-ఆరణ్య పర్వభాగము-శేషము ఇప్పటికి—7 ఏండ్ల క్రిందటనే ప్రకటితమైనను-సంశోధిత ముద్రణ పాఠములను అప్పకవి పాఠములతో సరిచూచు పరిశ్రమ జరగలేదు.

అట్టి దాని కిదే ప్రారంభము —

దీనివలన-అప్పకవి నన్నయ పాఠములను, తాళపత్ర ప్రతులు పరిశీలింపకుండగనే, ఎట్లు మార్చినాడో—కొన్ని పట్టుల తన మతమున కనుగుణముగా క్రొత్త పద్యమును వ్రాసి నన్నయపేర భారతమున నెట్లు ప్రక్షిప్తము చేసినాడో ఏ తాళపత్ర ప్రతులలోను కనుపించని క్రొత్తపాఠముల నెట్లు సృష్టించినాడో సాహిత్య లోకమునకు విశదము కాగలదు.

లేఖకులు, పాఠకులు—లక్షణ గ్రంధకర్తలు భారత పాఠములు ప్రక్షిప్తము చేసినారని బాహాటముగా చాటిన అప్పకవి తానే,

ఆ మార్గము ననుసరించినాడని కూడ యిందువలన తెలియగలదు.

దీనినే "ఒజ్జల పుచ్చకాయ" యందురు.

**'వికృతి'** అను పదము తొలుత తెలుగున ప్రవేశపెట్టిన అప్పకవి, భాషవిషయమున నెట్లున్నను ప్రకృతి సిద్ధములైన నన్నయ పాఠములను నెట్లు వికృతముగా చేసి, నన్నయ యతిప్రాసల నెట్లు పులిమి పుచ్చినాడో ముందు చూడగలరు.

ఇప్పటికి నూఱేండ్ల క్రిందటనే అప్పకవీయ తృతీయాశ్వాస విమర్శనము ప్రారంభమైనది. కూచిమంచి వెంకటరాయకవి, సుకవి మనోరంజనము అనే తన గ్రంథమున అప్పకవీయమును ఖండించినాడు దానిని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ముద్రించుచున్నారు.

ప్రస్తుత వ్యాసము, సంశోధిత మహాభారత పాఠములకు మాత్రమే సేమితమైనది-తొలుత యతులనుగూర్చి విమర్శించెదను.

# 1. అభేద విరతులు

"వేదముఖమున 'వబయోరభేద' యనుట  
వలన వబలొక్కటొక్కటి విలుచు విరతి  
కవనిలడలకు లళలకు నట్లు కలిమిఁ  
జేసి తమలోన నవియును జెల్లుచుండు. (87)

"నుతజల పూరితంబులగు నూతులు నూఱిటికంటె సూనృత  
3 4  
వ్రతయొక బావిమేలు మది బావులు నూఱిటికంటె"  
(ఆది. 4-94)

సంశోధిత ముద్రణమున – 'బావి' 'బావులు' అను రెండు పట్టులను పాఠభేదములు దాహరింపబడినవి. 3 వాపి. ఎ. క. మ. స.

4. వాపులు–ఇ, వి, క. మ. స. (పుట 203)

అయిదు ప్రతులలో వాపులని కలదు.

దీనినిబట్టి–నన్నయ–'వాపులు' అనియేగాని బావులు అని వాడలేదనుట స్పష్టము. ఈనాడు మనకు "వావులు" ఇంపుగా కనిపింపకపోవచ్చును కాని నన్నయ బావి శబ్దము వాడనేలేదు – అతడే

సీ. పా. బహువిధాగారముల్ ప్రమదవనంబుల  
వాపుల దీర్ఘికావలుల వెలసి (స భా. 1-283)

(సూని. 7వ సం. వాపి శబ్దము క్రింద పై ప్రయోగమీయబడినది)

అని వాపి – యతిస్థానమున ప్రయోగించినాడు. వాపి శబ్దము – ధర్మశాస్త్రప్రయుక్తము.

"ద్వారహీనో భవేత్కూపో  
ద్వారేణైకేవ వాపికా"

| | |
|---|---|
| బావిశబ్ద ప్రయోగము శ్రీనాథుని కాలమునుండి మాత్రమే గలదు. | తత్త్వ రత్నాకరము – (చి. ని.) |
| ధరణీధరము పొంతతల్లి బారి. కాశీ. 3.27 | సూ. ని. 5 సం. 1130 పుట |

వ్యవహారమున పూర్వపు న్యాయశాస్త్ర పత్రములలోను "వాపీ కూప తటాకారము" – అని వ్రాయించెడివారు. ఇప్పటికి పల్లెలలో నిది వ్యాప్తిలోనున్నది.

పై పద్యమున – బావులు – అను పాఠము అప్పకవి కల్పితమని మఱియొక హేతువుచే నిరూపింపవచ్చును –

వ కారము ఏక తరయతికి చెందినది–ఇది మఱియొక హల్లుతో యతి మైత్రినందదు –

మరఱలవ – కవి జనాశ్రయము  
మరఱలవ – విన్నకోట పెద్దన  
శర మఱవ – అనంతుడు  
మరఱలవ – చిత్రకవి పెద్దన –

ఇట్లు తనకు ముందుగల లాక్షణికులు – 'వ' ఏకతర యతి క్రింద పరిగణింపగా, అప్పకవి ఈయతిని విస్మరించి – వకారమునకు 'బ'తో యతి నన్నయ ప్రయోగములోనే చూపుట శోచనీయము –

ప్రాచీన లాక్షణికులు – ఏకతరయతిక్రింద పరిగణించిన వర్ణములకు నితరాక్షరములతో యతి ప్రయోగములు లేకపోవుటవలననే యని గ్రహింపవలెను – ఏకతర యతులకు పూర్వకవుల లక్ష్యములు – చూపబడలేదు.

అప్పకవి నన్నయ చింతామణి కర్తృత్వము నారోపించుటకు చేసిన – ఛందోలక్షణ మిది – నన్నయ 'వాపి' శబ్దము తప్ప 'బావి' వాడలేదు – నన్నయలో వ. బ. యతి సరిగదా, వ, ప **యతియు** లేదు –

## ii

ప్రతిబల దర్పభంజనుఁడు పార్థుఁడు... ... ... ...  
... ... ... ... మహాంబు వృష్టిప  
ర్వతము గ్రహించునట్లు తన బాహుల వాని గ్రహించి  
ఆ. ర. 1-311

సంశోధిత ముద్రణమున –

1) వ ... ... ... ... ... ... వ  
ర్వతము గ్రహించునట్లు బలవంతుఁడు దాని గ్రహించి.

అని పాఠమే మూలమున గలదు –

పుట యడుగున (74) 5. తన బాహులవాని గ్రహించి అక, ఒ, ఛ –

ఇందు — లక అనగా అప్పకవి — అప్పకవి. అతనిననుసరించిన మఱి రెండు ప్రతులలో తప్ప — 'బాహుల' అను పాఠము లేదని పైదాని కర్ణము—22 తాళపత్రములలో లేదని నిర్ధారణ —

నన్నయలో వలపలగిలక యతిని నియతముగా పాటింపబడినదని యూవలకే — తెలిపియున్నాను.

ప్రాచీనులైన కవిజనాశ్రయ కావ్యాలంకార చూడామణికర్త్రి అభేదయతి చెప్పకపోవుటకు కారణము — నన్నయ భారతమునందట్టి ప్రయోగములు లేకపోవుట చేతనేయని యెఱుగవలెను —

భావప్రకాశిక[4] — (పుట 75) లో నిట్లున్నది "ఈ యతి ప్రాచీన మతముగాదని నేడు కొందఱు భారతమునుండి యభేదయతి కొసగిన లక్ష్యములలో పాఠాంతరములు పరించి యభేదయతి లేదందురు — ఆ పాఠభేదము లీ క్రిందివి —

ప్రత — వాపులు (బావులు పూ. ము)
ర్వత — వంచుడు (తన బాహుల పూ. ము)
వల్ల — నెవంబు (నెవంబున—పూ ము)
వర — వాని (పరత — పూ ము)
అవా — వారికి (పార — పూ. ము)
వీరు — వివే (విభేదమెన్నడు పూ ము)

అభేదయతినివారించుటకై చెప్పబడు పాఠాంతరములు సహజముగ, స్వరసముగ జూపట్టుచున్నవి ఆపైని ఈ పాఠముల సామంజస్య మెట్లున్నను అని వ్యాఖ్యాతలు శంకించిరి దీనికి సమాధానము.

1) ప్రాచీన లాక్షణిక ఏకతర యతి సంప్రదాయము
2) నన్నయ యతి ప్రాసతత్త్వము
3) తాళపత్ర పాఠ ప్రామాణ్యము —

ఈ మూడు నెఱుంగలే — అప్పకవి చెప్పినదే - పరమ ప్రమాణముగ నెంచు వ్యాఖ్యాతలు పై రీతిగా వ్రాయుటలో వింతలేదు -

యతిప్రాసల విషయమున కవిత్రయ. శివకవిత్రయ. శ్రీనాథులు తప్ప లెక్కినవారి ప్రయోగములు యతిప్రాస తత్త్వ పరిణామమును దెలుపవు.

పై వ్యాఖ్యాతర పాఠములను విమర్శించుచున్నాను.

## 2. అభేదవర్గ యతులు

"తనకడలేని బకారం
బునకు స్వవర్గజములైన మొదలి లిపుల రెం
టను బైరిపి నొకటను వా
యూరువాబుయ వేదవర్గ యతి నా నెనయున్ (98)

ఇందు పకారంబు, ప, వ, బ, భలతో యతి చెల్లునని లక్షణము

ఇందు నన్నయ భారతమునుండి 4 లక్ష్యములున్నవి.

లక్ష్యములు :—

1) భూ వల్లభ తక్షకాధము నెవంబున — ఆది 1—128
వల్లభ తక్షకాధము నెవంబున — అని పాఠము. నెవము శబ్దము శ్రీనాథుడు నిర్ధారకముగా ప్రాసయందు వాడినాడు —
చివురు కెమ్మోవి చిఱుగాటు నెవముగాగ —
సంశోధిత ముద్రణము. దీనిని చూపెట్టినది (నైష—7—47)
సూ. ని. నెవము అనియే గ్రహించినది 4 స—పుట 877.
ఎ అన తత్సేవ తాత్పర్యంబు తగ నెవ బూన (హరి. పూ. 1—37)
కావున ప-వ యతిలేదు

2) పరమధ్యానో
పరతేంద్రియ వృత్తి నున్నవాని శమీకున్ (ఆది 2-172)
"ధ్యానా వరతేంద్రియ వృత్తి న న్నవాని శమీకున్."
(సంశోధిత ముద్రణము)
ధ్యానా వరతేంద్రియ వృత్తి; పెక్కు పతులు (పుట 94)
కావున నిచట స వ యతి లేదు.

3) క కోరి యానేక యుగంబుల
పారతపోయుక్తులైనవారికి ఆర 1 371
ఇచ్చటను అవార తపోయుక్తులని పాఠము.
సంశోధిత ముద్రణము
నాగిత శరసమితి — ప, ల, వ — ఈ పాఠమున పవ యతి వారింపబడినది (పుట 45) పై తాళపతులో-'ల' బౌసుదొర పెక్కు తాళపత్రపాఠములనుబట్టి నిర్ణయించినది.

4) వీరు వారనునట్టి బుద్ధి విభేద మెన్నడులేదు (ఆది. 8-29)
సంశోధిత ముద్రణము (పుట 432)
వీరు వారనునట్టి బుద్ధి వివేక మెన్నడు తాళ కొన్ని పతులు.
అని తెలిపినది — నన్నయ నియమమునుబట్టి ఇందు "వివేక మెన్నడులేదు" అనియే సరియైన పాఠము —

## 3. యుష్మదస్మచ్ఛబ్దయతులు

క క్షితి నస్మద్యుష్మత్పద
యతులనగావ్యముల యుష్మదస్మచ్ఛబ్ద
ద్వితయమునకుంబ్రాణము
లతికిన దుభయంబు చెల్లు నభయనిదూరా

వి. అస్మద్ — యుష్మద్ అను శబ్దద్వయమునకు స్వరము పరమై సంధియగునపుడు ఉభయయతి చెల్లును —

